

శ్రీ

# ఒప్పదు.



శ్రీ రాజస్థాన దేశమందలి
నాగేంద్రపుర గ్రామములో గల
రాజకుటుంబపు చిన్ని బాలికలు
డోలిక లూగుటకై పయనమైరి.

అట్లతద్ది అద్దినమునను గనుక
ప్రొద్దుటనే చద్ది ముద్దలను తిని
ముద్దులు మురిపెములును కురిపించుచు
ఐదు వందలో, ఆరు వందలో
పది పండ్రెం, డేండ్ల ఈడును గల
సిగ్గును తెలియని చిన్ని బాలికలు
వచ్చీ రాని ఒయ్యారములతో
పెండ్లి కాకుండినా సరదాపడి
వడి వడి తోటకు నడువగ దొడగిరి.
గరగరలాడే పట్టు గాగరాల్,

మిలమిలలాడే మేలిమి పైటలు,
రకరకములు గల వెలకమలు రైకలు
ఇవె ఆ పిల్లల దుస్తులు, ఆ పై,
గుండ్రని మొగముల కుంకుమ బొట్టులు,
కన్నుల నిండా కాటుక రేఖలు,
జడలలోన కరువేపా దవనము,
చెవ్రుల కొనల దుమికే జుమికీలూ,
పైటలపై తుళ్ళే హారాలూ,
చేతుల గుత్తపు గాజుల తొడుగులు,
మొలలను గంటల ఒడ్డాణాలూ,
కాళ్ళయందు చిరు మువ్వల అందెలు,
ఇట్లు వస్తువులతో ముస్తాబై
"వస్తారా" అని ఒండొరు పిలుచుచు,
గవ్వ గుత్తి వలె గలగలలాడుచు,
చిలుకల వలె కలకలమను వారూ
పలుకీల నవ్వుచు కేకేసే వారూ
పిల్లి పిల్లల వలె గంతే వారూ
దానిలోని తూనీగల్లు బెదరగ
చిన్ని చప్పట్లు చరచే వారూ
గడ్డి పువ్వులను కోసే వారూ
అటుపై పదుగురేసి ఒక్కొక్క జట్టుగ
చెట్టాపట్టీలు కట్టుకొని తమ

ఊరి బయటి ఉద్యానవనములో
చొచ్చిరి ముచ్చటగా ఆ పిల్లలు.
చొచ్చి అచ్చటను విచ్చలవిడిగా
ఎచ్చటను చూచినా తామె ఐ,
వచ్చిన చోటికె వచ్చుచు తిరిగి
పోయిన చోటికె పోవుచు మరియూ
తోట ఎల్ల ఎగిరి పోవు నట్లుగ
గొల్లున హాస్యపు మాటల' నాడుచు
హాస్యములకు పకపకమని నవ్వుచు
ఒండొరులను "ఓ" "ఓ" అని పిలుచుచు
తోట నడిమి మఱ్ఱిచెట్టుకిందకు
డోలిక' లూగగ బాలిక' లేగిరి.
చెట్టు కొమ్మ' కుయ్యాల కట్టుటకై
గట్టి తాడు ఎవతె తెచ్చెనో అని
అందరూ ఒక్కమారే అడిగిరి.
కాని అయ్యో పాపము! ఆ పిల్లలు
మాట సందడిని మనువు మరచి' నట్లు
ఆట సందడిని తాటిని మరచిరి.
ఆమె తెచ్చు' నని ఈమె తేకుండ
ఈమె తెచ్చు' నని ఆమె తేకుండ
మొత్తమునకు ఎవరూ తేకుండా
ఉత్త చేతులను ఊపుకొనుచు, ఎట్లు

# 4

'ఉయ్యాల' బాగుటో ఊహింపకయే
ఉయ్యాల తాటిని తెచ్చుట మరచిరి.
అయ్యవ్వో అయ్యయ్యో పాపము!
ఉయ్యాల కట్టుట ఎట్లో తెలియక
చిన్నబోయి వాడిన మొగములతో
కన్నీరు తిరుగు కన్నుగవలతో
ఒండొరు మొగముల తేరి చూచుచును
పెదవులు తడుపుచు ఊర్పులు విడుచుచు
నేలపై బొటన వ్రేళ్ళను రాయుచు
చేతులు తేలగ వేలంగ వైచి
నిలువబడి ఉన్నయట్టి సమయమున
ఆకసమునుండి ఉట్టిపడ్డట్టు
ఆ తోటకు మెలమెల్లగ వచ్చెను
మచ్చ ఒక్కటీ లేక పాలవలె
అచ్చముగ తెల్లనైన ఒళ్ళుతో
పొడలుపు గల చక్కని మొగమ్ముతో
వెడదయైన కాటుక కన్నులతో 75
వాడి గలుగు వంపిన కొమ్ములతో
ఉబ్బుగా ఉన్నయట్టి పొదుగుతో
'కామధేను' వన దగిన ఒక ఆవు.
ఆ గంగి గోవు అడుగుల వెంబడి
అడుగులను లెక్క పెట్టుచున్నట్లు

పెండ్లి నడకలను నడుచుచు వచ్చెను
పెండ్లి కొడుకు వలె కలకలలాడే
చక్కని నవ్వు మొగము గల వాడూ
చూడ చక్కనౌ సొగసుల వాడూ
సన్నబీరపై నూగు లాగున నె
నూగు మీసమును కలిగిన వాడూ
చిలకట్టూ మొలకట్టూ కట్టుక
చిన్నికృష్ణు వలె చేతను కోలను
గోవుల తోలగ పట్టిన వాడూ,
పద్నైదేడుల ప్రాయంపు వాడు.
ఆ గొల్లవాని కనుగొని' నంతనె
చింత విడిచి చిన్న పిల్ల' లెల్లా
అటు తిరిగి ఒక్క గొంతుకతో "ఓ
బవ్వా, ఓ బవ్వా, ఓ బవ్వా,
చప్పున ఇచ్చోటికి రావవ్వా,"
అని తమ గొంతులు పగులగ అరచుచు
ఊడు' నటు చేతు' లూపుచు పిలిచిరి.
దగ్గర చేరిన బవ్వని చుట్టూ
పువ్వుపై తేనెటీగల లాగున
మూగి ఆ పిల్ల' లెల్ల గొల్లుమని
"తోడు" "తాడు" "తా" డని రొద సేసిరి.
చేతి మునికోల గడ్డము కిందికి

ఊతగా పెట్టుకొని నిలువంబడి
పాదరసము నిండిన చిప్పల వలె
నవ్వున కొలకలలాడు కనులతో
కన్నియల దిక్కు కనుగొని బప్పడు:
"తాడా? తా' డేటికి కావలయును?
సిగల జుట్టుకొనుటకు జడతాడా?
నడుములు బిగించుటకు మొలతాడా?
మగల మీ వలలలోన వేసికొని
గట్టిగా కట్టుటకు వలతాడా?
ఎట్టి తాడు కావలయునొ చెప్పుడి."
బప్ప' డీలాగు అడుగగానె విని
"ఉండరే" అనుచు తక్కిన పిల్లల'
నెల్ల మెల్లగా వెనుకకు త్రోయుచు
తక్కువ వారలకంటె ఆర్నెలలు
ఎక్కువ ఈడు గలట్టి చిన్నదీ
అందరి కంటే ఒకింత పొడవరి
అందరి కంటె ఒకింత గడసరి
గ్రామపు పెత్తనదారు కూతురూ,
పన్నా అన్నట్టి ఒక్క చిన్నది
ఒక మూ' డడుగులు ముందరకు వచ్చి
కాడ మీద ఒక్క కొంచెము వంగిన
తామర వలె మొగ' మించుక వంచుక

బప్పని దిక్కుకు తిరిగి నిలువబడి: 125
"బప్పా, ఎపుడూ హాస్యాలేనా?
ఇప్పుడు నే చెప్పే మాటలు విని
చెప్పిన లాగున చేసి పెట్టితే
తప్ప' కుండ నీకు పుణ్య' మబ్బును.
ఇది అట్లతదియ ఎరుగుదువు గదా"
అన విని బప్పడు మాట' కడ్డమై
"అమ్మాయీ, ఇది అట్లతదియ అని
ఎట్లు నేను ఎరుగుదు' ననుకొంటిరి?
అట్టు గాని ముక్క గాని ఒక్కటి
పెట్టినా పాపమున పోయినారా?
'బప్పా,' 'బప్పా,' అని మీ' రిప్పుడు
చరచిన చప్పట్లు తప్ప మరి ఏ
చప్ప' ట్లయినా పుల్ల' ట్లయినా
తినుమని నా చేత పెట్టినారా?
అవసరమునకు కావలసిన బప్పడు
ఆరగింపునకు అక్కరి లేదా?
పోనిండు, ఇంతయే కద మీ దయ!
చెప్పండీ నే' చేయగ పలసిన
సాయ' మేమిటో చేసి పెట్టెదను"
అని ఎగతాళిగ పలికిన బప్పని
వైపు చూపి పన్నా "విన్నారా

ఈ బప్పని గడుసుదనపు మాటలు?
'బప్పా, మే' మేల నిన్ను మరతుము?
ఎప్పు' డేది మేము నిన్ను కోరిన
తప్పకుండ చేసి పెట్టు చుందువు;
ఎప్పటి దయు ఇప్పుడు చూపెట్టుము.
అట్లు నీకొరకు అట్టె ఉంచితిమి.
మరి నా మాటకు అడ్డుగా రాక
చెవి ఒగ్గి వినుము జాగ్రత్తతోడ.
అట్లతదియ ఈ దినమున గావున
ఉయ్యాల' లూగగ వలె' నని ఇచటికి
ఉబలాటముతో మేము వచ్చితిమి;
కాని రావలె' నటన్న సందడిని
ఉయ్యాల తాటిని మరచి వచ్చితిమి"
అన విని బప్పడు పకపక నవ్వుచు:
"వహ్వారే! వహ్వారే! వహ్వా!
పెండ్లికుమారుని మరచి దిగవిడచి
పెండ్లికి పోయిన పేరటాండ్రవలె
ఉయ్యాల తాటినే మరచిపోతిరా?"
అన పన్నా కోపముతో: "బప్పా,
మమ్ము గేలి చేయుటయే గొప్పా?
ఊరక నవ్వుచు నిలుచుటె మెప్పా?
తాడు తెచ్చి పెట్టుటయూ తప్పా?

చేతి' నైన ఈ సాయము చేయుము;
ప్రతియెడల నవ్వును కట్టిపెట్టి
సాధారణ నీ దారిని పట్టుమని"
అని బప్పాను నవ్వుచు: "ఓ పన్నా,
కోపము నాపై చూపెద' వన్నా!
పెట్టుకొన్న బొట్టు చిట్టి పోవగ
కన్ను బొమలు ఏటికి ముడిచెనవగ?
తాడు మరచి వచ్చిన మీ పరాకు
విని నవ్వగ ఏటికి ఈ చిరాకు?
వీరికి సహాయము చేయ' నంటినా?
తాడు తెచ్చి పెట్టక పోయెదనా!
కాని దాని' కొక్కటి షరతు' న్నది.
తెచ్చినట్టి తక్షణమే నాచే
తాడు మీరు కట్టించుకో వలెను"
అన్నమాటలకు పన్నా: "బప్పా,
ఇప్పుడు నీ తెలివికి నవ్వెదము?
నీవు తాడు కట్టి పెట్టకుంటే
ఎట్లుగ మేమీ చెట్టుపై' కెక్కి
కొమ్మలకు తాడు కట్టగలుగుదుము?"
ఇట్లుగ పన్నా అన్న మాట విని
బప్పడు: "అమ్మాయీ, నవ్వెదరా?
నవ్వండీ, మి' మ్మెవ్వ' డడ్డెడు?

నవ్వు మీ మొగములకు సింగారము
కావున మరీ మరీ నవ్వండీ.
కాని నా అభిప్రాయమది మాత్రము
మీకు తెలిసినట్లు కనిపించదు.
చెట్టు కొమ్మలకు ఉయ్యాల తాటిని
కట్టుట నా ఉద్దేశము కాదు;
కొమ్మలైన మీ మెడలకె తాడో
అమ్మాయీ, నే కట్టెద' నంటిని.
ఇందుకు మీ' కందరకూ సమ్మతి
ఐతే చెప్పండి, తాడు తెచ్చెద."
ఈ మాటలు విన్నంతట పన్నె
తక్కినట్టి పిల్లలతో కూడా
సిగ్గుచే మొగము కొంచెము వంచెను.
బప్పడు వదలక, "బాలికలారా,
ఇప్పుడె పెండ్లి కొమార్తెల చొప్పున
మొగములు సిగ్గున వంచెద' రేలా?
లెండు, ఈ సిగ్గును వదలండి,
పెండ్లి చేసికొందము చెప్పండీ,
బృందావనమున మందలు కాచిన
గోవిందుడును గొల్ల సుందరులు,
కూడి వేడుకగ రాసక్రీడలు
ఆడినట్లు మనమున్నూ జలకూడుక

అనుకొనిన త'ప్పేమిటో? రండి."
బప్పని పలుకులు విని ఆ పిల్లలు
వారిలో వారు ఒకరితో ఒకరు:
"ఔనే, ఓసీ, ఏ' మంటా వే?
త' ప్పేమే?" "అబ్బెబ్బె! పోవే,
ఎవ' రైనా వింటే ఇక ఉందే?
సిగ్గు సిగ్గు!" "అట్టు కాదే వినవే.
వట్టి అబద్ధపు పెండ్లియే కదే?
ఎవరు చూడవస్తా' రీ మూలకు?
ఉస్తి ఆకునో విస్త్రాకునో
పుస్తె కట్టినంతటనే ఈతడు
శాస్త్రోక్తముగ మన మగ'డౌతాడా?
మన' మీతని పెండ్లాల' మౌదుమా?
ఇది ఒక వేడుక పొద్దుపోవుటకు,
ఇక లేవే." "ఐతే కానీవే,
నలుగురితో చా' వైనా పెండ్లమ్మే."
అని విసవిస ఒక దెసకు ముసరుకొని
వెస గుసగుస' లెసగగ పసిపిల్లలు,
ముసిముసి నవ్వులు నవ్వుచు బప్పని
కొసరు చూపులను చూచుచు నిలిచిరి.
వారి అభిప్రాయమును కనిపెట్టి
బప్పడు వా' రక్కడనె నిలువబడి

చూచుచున్నయంతలోనె తిరిగి..."
చెట్టుమొన గట్టి తాను పట్టుక
వచ్చి, "ఇక్కడిగో, వచ్చితి సీతా అదిగోనమ్మా,
మరి ఇక ఆలస్యము చేయకండి.
'ఈ సుముహూర్తము మించిపోనివ్వ
పెండ్లికొమారాలకు కడు వేగమో"
అని చిన్నారిన్నాను నవ్వుచు పిలిచెను.
ఏ జరిగెను వేడుక వేడుక.

ఆనందము ఆనందము ఆయెను:
శ్రీరాముని వంటి పెండ్లికొమరుడూ,
సీతమ్మ వంటి పెండ్లికూతురులూ,
ఎవరికి ఆనందము కలుగదు?
లక్ష్మీకల్యాణము ఒక భాగ్యమో?
గౌరీకల్యాణము సౌభాగ్యమో?
ఇదియే భాగ్యము, ఇదె సౌభాగ్యము.
బంగరు బొమ్మల పెండ్లిండ్లు తరుచు
చేసే ఈడున ఉన్న ఆ చిన్ని
బంగరుబొమ్మల పెండ్లి ఎవ్వరికి
ఆనందము కలిగింపక ఉండును?
ఆ వేడుక చూడగ ముచ్చట పడి
గాలికి పైకెగయుచున్న తీగెలు
నిక్కి నిక్కి కనుగొనగా సాగెను.

ఆకుల చాటున ఒదిగిన పూవులు
తొంగి తొంగి చూడఁగా సాగెను
మైనల్లు, కాకాతువ్వలు, గువ్వలు,
సావురాలునూ, కోవిలపిట్టలు,
చిలుకలు, సీతాకోకలచిలుకలు
"రండీ, బప్పారాయుడి పెండ్లిని
చూడఁ బోవుద్దము రండీ" అటంచు
సంతోషముతో ఎగురుచు వచ్చెను.
ఆ పిల్ల' లెల్ల ఉల్లాసమ్మున
పూవులలోపలి పచ్చనిపొడితో
బప్పని ఒంటికి నలుగులు పెట్టిరి.
దొండపంటి ఎర్రని రసంబుతో
బప్పని మొగమున బొట్టును పెట్టిరి.
చీకటిచెట్టుల ఆకులను పిడిచి
ఆ పసరుతోడ బప్పని బుగ్గను
దృష్టి పోవుటకు చుక్కను పెట్టిరి.
ఎర్రని పచ్చని పూవులు గుత్తిగ
చేర్చి ఇటూ అటు తీగెలను కట్టి
పదిలముగ అదే బప్పని నుదుటను 275
పెండ్లి బాసికముగాగను కట్టిరి.
తీగెలపై గుమగుమమను పూవులు
కోసి దండలుగ చేసి కొన్నిటిని

బప్పని మెడ హారాలుగా వేసి
కొన్నిటి సిగపై సొగసుగ చుట్టిరి.
ఇటు బప్పడు పెండ్లికొడుకు కాగా
తా మల్లి పెండ్లికూతు రగుచును
ఎవ్వతెకు మొదట పెండ్లియొ తెలియక
ఎవతె మట్టుకదియే సిగ్గుపడుచు,
"నీవే" "కాదే, నీవే," "నీవే
నాకంటె పెద్దదానవు కావే?
"చిన్నదాని ముద్దే కానీవే,"
"ఇది ఎక్కడి సబబే? పోపోవే,"
అని ఒకరొకరి ముందుకు తోయుచు
ఒకొక్కొక్కడుగును వెనుకకు వేయుచు
వంతులు తెగక ఒకింత తగవుపడి
అంతా ఒకే మారే పెండ్లాడగ
అంతట వారొప్పుదలను పొందిరి.
ఆమీద వివాహమ్ము మొదలయ్యెను.
దట్టముగా కొమ్మలతో కమ్మిన
చెట్టే పెండిలి పందిరి ఆయెను.
రంగుల పువ్వులు రాలిన నేలయె
ముగ్గులతో పెండ్లితిన్నె ఆయెను.
ఝంఝమ్మను తుమ్మెదల మోతయె
ఢంఢమ్మను బాజా ధ్వని ఆయెను.

ఆడు కోకిలలు పాడిన పాటలె
పేరటాండ్రు పెండ్లిపాట లాయెను.
చిలుకలు గొల్లుగ పలికిన పలుకులె
బాపలు చదివిన మంత్రము లాయెను.
మీదినుండి జలజలమని రాలే
పచ్చని పువ్వులె అక్షత లాయెను.
పూవులను పెట్టి కట్టిన తీవెలు
ఒక్కొక్కటిగా అప్పుడు తీయుచు
అందరిలోపలి ముందుగ తనకుడి
పక్క కూర్చున్న పన్నా బాయికి,
అటుమీద ఎడమ వైపున కొంచెము
ఎడముగ కూర్చున్న చిన్నదానికి,
ఆ వెనుకను ఆ వెనుక దానికీ,
అటుపై అటుపై ఉన్నదానికీ,
తరవాతను తరువాతి దానికీ,
ఇట్లె ఆ ఆరు వందల మందికి
మెడలపై అన్ని తీగపుష్పలను
జడ లడ్డకుండగా తప్పించుచు
మూడు ముళ్లు వేసికొనుచు వెళ్లెను.
అప్పుడు తిరిగి వచ్చి కూర్చుండ
బాలిక లెల్లా అతని చుట్టూ
గుండ్రముగా కూర్చుండి వేడ్కతో

అంతకు ముందే కోసి కుప్పగా
పోసినట్టి సన్నజాజి మొగ్గలు
దోసిళ్ళ కొలది తీసి తా మరలి
శిరసు మీద తలబ్రాలుగ పోసిరి.
ఆరు నూర్ల దోసిళ్ల మొగ్గలూ
ఊపిరి సలుపకయుండ ఒకమారె
కుమ్మరించు ఆ అమ్మాయిలతో
చాల లేక తల ఒగ్గి తటాలున
బప్పడు లేవంగ బాలికలునూ
గబాలుమటంచు లేచి నిలువబడి
ఒకరొక్కరి చేతులను పట్టుకొని
చంద్రుని చుట్టూ గాలిగుడి లాగు
గొలుసు కట్టి చక్కని వరుసలతో,
పాటలు పాడుచు చుట్టూ తిరుగుచు
తెయ్యి తెయ్యిమని నాట్యము చేసిరి.
సంతోషముతో, ముఖము వికసిల్ల
బప్పడు 'కొమ్మల' కుయ్యేలను కట్టి
ఒక్కొక్కరి తెన, ఒడిలో పెట్టక
"ఉయ్యాలో, జంపాలో," అటంచు
ఊపున బాగుగ ఊగగసాగెను.
మొగముమీద చిరుచెమ్మట కమ్మగ
గాలిచే పయటకొంగ పైకెగర

“ఆహా! పశువా! అప్పుడే మీరు
పెండ్లాడిన అధికారము పూర్తిగ
చూప తలచుకొన్నారా? పన్నా,
కొంగు ముళ్లతోనే మగవారల
స్వాతంత్ర్యము సంపూర్తిగా పోయి
పెండ్లాముల దాసులు కావలెనా?
అస్లే భీం చూపులకు కట్టుబడి
ఆగియుందు’ నన్నా వీలు లేదు.
నాసివల్లి నిష్ఠుర’ మనగా ఇదె;
అయినా కోపింపక సెల’ వొసగుడు”
అని ఒక చిన్నది: “ఏమే? పన్నా,
మాటలు రావే? అడుగగ లేవే?
నోటిలో కుడుము పెట్టుకొన్నావె?
అంత కోప మునిగిన పని ఏమో!”
అన బస్వడు: “ముద్దుల పెండ్లమా,
కోపమే కాదు, కోపం కంటెన్నా
ప్రాణము కంటెను హెచ్చగు పరువే
నే’ నిప్పుడు పోకుండె పోవును.
నా వెంట వచ్చినట్టి ఆ ఆవు :
నిన్న మొన్న అటుమొన్న ఏ
హేతువో కాని పట్టి పోయినది.
ఎవరు దొంగతనముగ తోటలలో.

పితుకుకొని పోయినానో తెలియదు.
ఇంటివారికి అనుమానము పొడమెను
అన్యాయముగా నాపై తిరిగెను.
చవితి చందురుని చూచితినేమో!
కృష్ణుపై శ్యమంతకమణి గురించి
కలిగిన లాగున దొంగనటించుచున్న
నాకూ నీలాపనింద కలిగెను.
అది తీర్చుకొనే ఉద్దేశముతో
దొంగనెట్లయిన పట్టుకొనుటకై
పోవుచు, ఇచ్చట జాలము చేసితి.
ఇపుడు మీరు నా పెండ్లాలగుటను
నా పరువూ మీ పరువే కావున
సెలవు ఇచ్చి దయతో పంపించుడి.
అన్నప్పుడు, మరొక మాట మరచితిని:
వేడుకగా మన మిక్కడ ఆడిన
ఆట మాట పొరపాటున మీ మీ
ఇండ్లవద్ద చెప్పెదరు సుమండీ!
అది మీ మనసులలోనె ఉంచుడీ!
కొంచెమైన నాపై కుబికిన దంటే
ఇక్కడ జరిగిన పెండ్లి అబద్ధము,
ఇండ్లవద్ద వేద మంత్రములతో
జరిగే పెండ్లి నిబద్ధి కాగలదు,”

అని చిరునవ్వును నవ్వుచు బప్పడు
కదలి తోట దాటి వెళ్ళి పోయెను.
కనబడు చున్నంత సేపు పిల్లలు
ఆ వైపే చూచుచు నిలువంబడి
అటుపై మెల్లమెల్లగ చింత విడిచి
ఉయ్యాల' నెక్కి ఊగగ సాగిరి.

అట్లు బప్పడు ఎటు ఆవు పోయెనో
ఎరుగక మనమున పరిపరి విధముల
తలపోయుచు, ఆవు నడక జాడల
బట్టి చెట్లు నీడలు గల తోటల
లోన ఉన్న బాటల' కడ్డముగా
అల్లిబిల్లిగా అల్లుకొనినట్టి
మల్లి మొల్ల విరజాజి తీగెలను
మెల్ల మెల్ల తప్పించుకొనుచు, ఎటు
చీమ చిటుక్కు' మనుచున్న తటుక్కున
తిరిగి చూచి అటు ఆవు లేకున్న
మనసు చివుక్కున పొక్కుచుండగా
మనుజుల సంచారము మన్నెరుగని
లోపు జీబు వనమునందు చొరబడి,
అక్కడి పిట్టలు తపతప రెక్కలు
కొట్టుకొని హఠాత్తుగ పై' కెగిరే.

చప్పుడులకు తుళుకుపడుచూ, ఈతలు
తుమ్మలు బలురక్కసులూ మొగిలులు
డొంకలుగా పెరిగిన చిట్టడవిని
దూరి సూది ముండ్లకు వెత చెందుచు
పోయి పోయి, తల మీదకు సూటిగ
పొద్దు మింటిపై చేరిన యప్పుడు,
ఎండకు భయపడినట్లు నీడలు
చెట్టుల మొదళ్ళు చేరినయప్పుడు,
తాపముచే సాచిన రెక్కలతో
చప్పుడు లేకుండ పిట్ట' లన్నీ
ఆకు జొంపములు దూరిన యప్పుడు
నుదుటి చెమట తుడ్చుకొనుచు బప్పడు
చిట్టడవికి చిట్టచివరి తట్టున
చెట్టుచేమ' లట్టే పుట్ట' నట్టి
మెట్ట ఒకటి ఎట్టయెదుట చూచెను.
ఆ మెట్ట నట్టనడుమ తట్టునను
తెరచిన పెనుభూతపు నోటి వలెన
దట్టపు చీకటి కమ్మి ఉన్నట్టి
కడు వెడల్పు గుహా కనబడె ఎదుటను.
ఆ భూతము నోటను వేసికొన్న
నరజీవుల పేవుల ప్రోవుల వలె
తీవెలు గుహాలో అల్లుకొని ఉండె.

భూతము బిరుగుర్రి పెట్టి' నట్లే
గుహాముఖము హోరుమనుచునుండెను.
అడుగుల జాడల బట్టి చూడగా
ఆవు గుహను చొచ్చి' నట్లు అగపడె.
సాహసించి దానిలోన చొచ్చుటో,
తిరిగి వచ్చిన దారి పట్టుటో,
తోచక బప్పని మది తహతహ పడె.
"ఏ పుట్టలోన ఏ పా' ముండునొ!
మోక్షము కొఱకై ఆశించి పోవ
మొసలి ఎత్తుకొని పోయి' నట్లుగా
ఆవుకు తెగించి గుహలో చొరబడ
పురుగో బుట్రో పొడుచునో కదా!
నీలాపనింద పాపుకొనుటకై
గుహలోపల చొరబడిన కృష్ణునకు
ఎలుగుగొడ్డు దాపరించలేదా?
అట్లే ఇప్పుడు తటస్థ' మైతే
ఎటు తప్పించుకొనంగా వచ్చును?"
అని ఇటు బప్పడు తటపటాయించి
తటుకున మదిలో దిటవు తెచ్చుకొని,
"కానీ, నాకీ వట్టి బితు' కేల?
అడవుల మార్గాలల తిరుగాడే
పసుల తోలు పిల్లల కాపాడే

శ్రీకృష్ణుడు నా పాలను కలుగగ
చింత గాని భయము గాని ఏలా?
కాళియుని పడగను పాదము తొక్కిన
కరుణాత్ముడు నా పాలను కలుగగ
పాములు నన్నేమి చేయ జాలును?
జాంబవంతు బలమంతా అణచిన
శక్తిశాలి నా పాలను కలుగగ
ఎలుగుగొడ్డు నేమి చేయ జాలును?
కొండ చాటొసగి గొల్లల కాచిన
గోపాలుడు నా పాలను కలుగగ
కొండ గుహను చొరగా భయమేలా?"
అని గుహాముఖమునందలి తీగెల
తెమలించుచు దానిలోన చొరబడి
కారు కమ్ముకొన్న కటిక చీకటి
కనులు కాన రానియట్లు చేయుట
అడుగడుగుకు అడుగులు తడబడ కడు
తడుముకొని నడువగా నడువంగా
అంతలోన ఆ పై గుహాలోపల
ఏ రంధ్రములోనుండి చొరబడెను
కాని చిమ్మచీకట్లు మూలలకు
తోసి వేసి ఏడెనిమిది మూరల
కై వారపు జాగా వెలిగించుచు

ఇంచుకంత వెలుతురు కనిపించెను.
ఆ వెలుతురులో బప్పని తప్పిన
ఆవు బొమ్మ లాగున నిలువబడి
పొదుగునుండి ఎడ తెరిపి లేకుండ
ఆకాశగంగ ధారల తీరున
కారుచున్న స్వచ్ఛంపు పాలతో
నేలపై ఉన్న ఒక లింగమునను
అభిషేకము కావించుచునుండెను.
భూమిలోనుండి నిలువుగ మొలిచిన
బూడిదగుమ్మడి పండు వంటి ఆ
శివలింగమును కనుగొని బప్పడు
భక్తిచే ఒళ్ళు పులకరించగా:
"హరా హరా, మహాదేవా, శంభూ,"
అని భూభాగముపై సాగిలపడి
నొసలు నేలపై పూర్తిగా మోపి
మూడు మారులు మొక్కిన పిమ్మట
మోకరించి కూర్చుండి ఇటూ అటు
కనులు తిప్పి తన పక్క నేలపై
కృశించి కృశించి ఎముకల పోగై
శవమేమో అనిపించే వానిని,
ఒళ్ళంతా నరములు తేలుటచే
ఊసర వెల్లినిపోలే వానిని,

కోరపళ్ళ వలెనె గోళ్ళెదుగుటచే.
పిట్టలాగు కనుపట్టే వానిని,
గడ్డమూ మీసమూ జటిలని గల
వెండ్రుకలూ తలపై వెండ్రుకలూ.
నిడువుగా పెరిగి నెరసి ఉంటచే.
పత్తి రాశి వలె అగపడు వానిని, 525
అగ్గి ముగ్గినట్టి ఒక్క మౌనిని
చూచి ఆశ్చర్యపడి భయభక్తులు
మనసులో నిండ ఆ ముని ధ్యానము
పాడు కాకుండ నిశ్శబ్దముగా
ఊపిరి బిగబట్టి చుట్టుపట్లను
చూడంగా, శివలింగము వెనుకను
మూడు నాల్గు మూరల దూరములో
కత్తులు కటార్లు శూలములు గదలు
పట్టుకొన్న ఎన్నో చేతులతో,
మెడ చుట్టూ గుత్తులముగ కూర్చిన
పుర్రెలతో, ఎర్రగ వేలాడే
నిడుపు నాల్కతో, నిప్పులు కణకణ
కురిపించే కన్నులతో, నిగనిగ
మెరయుచు కనుగొను జనముల మనముల
భగభగమనిపించే మొగమ్ముతో,
కాలి కింద పెను రక్కసు తొక్కుచు

'ఒక్క దుర్గ విగ్రహము కనంబడెను''
ఆ దుర్గకు ఎదురుగ ఒక రాయీ
రాతి మీద ఒక పొడవగు కత్తి
కత్తి పక్క ఒక కవచము ఉండెను.
వీటికి బప్పడు వింతపడుచుండ
అంత ముని కనులు విప్పి కనుంగొని:
"బప్పా, నీ వెవ్వడవు? ఇచ్చటికి
ఏలాగున వచ్చితివో చెప్పుము.
ఈ గుహాలోపల వెలసి ఉన్న ఈ
ఏకలింగేశ్వరుని సేవింపగ
నా వంటి మునులు తప్ప మరెవరూ
తెగించి ఇచటికి ఎప్పుడూ రారు.
ఇట్టి రహస్యపు స్థలము గనుక నే
నేను వచ్చుటకు కారణ మైనది,"
అని ముని అడుగగ సాష్టాంగము పడి
లేచి చేతులను కట్టుక బప్పడు:
"ఓ స్వామీ, మీరలు సత్యఋషులు;
పిల్లవాడ నను ఉద్దేశముతో
"బప్పా" అని నను పిలిచితిరి గదా!
అట్లుగానె నా పేరూ బప్పడె.
ఈ మెట్టకు చేరువున ఉన్నట్టి
నాగేంద్రపురమే నే నున్న ఊరు.

ఆ ఊరిలోని రాచవారలకు
పసులకాపరిని, జాతికి గొల్లడే.
తల్లి నేనూ బ్రతుకుచున్నాము.
ప్రతిదినమూ ఆవులను తోలుకొని
వచ్చి ఈ అడవియందు మేపుదును.
ఇదిగో ఇక్కడ ఉన్న ఈ ఆవు,
వట్టి పోయి ఇల్లు చేరుచుండుట
బట్టి నాకు అపనింద ఘటిల్లెను.
కట్టి నీలాపనింద పాపుకొన
ఆవు వెంబడిని వచ్చితి నిచటికి.
ఇందు మూలమున ఐనా స్వామీ
మీ దర్శన మైనది, నే ధన్యుడ."
ఈలాగున పలికిన ఆ బప్పని
మాటలలో కలిగిన పొందికయూ
నడవడిలో కనబడు అడకువయూ,
అవయవంబులందల్లి పొంకమునూ
ముఖమునందు తోచే తేజమునూ
చూచి అతడు గొల్లవాడు కాడనీ
అనుమానమొదపడి ఆతనితో: "ఓ
బప్పా, నీవినయమునకు మెచ్చితి,
కోరుకొన్న వరమును నీకిచ్చితి
కోరు," మనగ మునికి మొక్కి బప్పడు:

"ఓ మహానుభావా, మీ దయచే
ఏమీ లోపము లేదు దాసునికి;
అయినా 'మీరలు కోరుమన్నపుడు
కోరకుంట అపచారము కావున
ఒక్కటి మాత్రము వేడెద, తెలుపుడు.
ఆ దుర్గాదేవి విగ్రహమునకు
ఎదురుగ కుదుపుగ ఉన్న రాతిపై
కత్తి కవచము ఏటికి ఉన్నవి?
ఈ మూరుమూల గుహాలోపల ఈ
దుర్గా శివలింగము ఎటు పుట్టెను?
తెలుపుడీ," అనిన బిప్పనితో ముని:
"కుమారా, విను, రాజపత్ని ఒక్కతె
తన మగని శత్రురాజులు చంపగ
అప్పటికి నిండు చూలాలై తా
నుండుటచే ప్రాణములు విడువగా
లేక ఈ గుహను దూరి దీనిలో
దాగి ఉండి పొద్దులు నిండంగా
అడవి జంతువులే మంత్రసానులుగ
పురుడు పోసికొని మగపిల్లని కనె.
గుహాలో పుట్టిన హేతువు చేతను
గుహుడను పేరా పిల్లనికి కలిగె.
ఆ పిల్లవాడు అంతై ఇంతై

అంతలోన యౌవనవంతుండై
తల్లి వల్ల వృత్తాంతమెల్ల విని
శత్రుల సాధించే కోరికతో
ఇక్కడ ఈ లింగమును స్థాపించి
పెక్కేండ్లు తపము చేసీ సిద్ధిని
పొందలేక తన ముసలితనంబున
ఈ దుర్గను నెలకొల్పి ఇక్కడనె
పూజింపగ గుహామాత ఆ గుహుని
పుత్రునిగా భావించి ఈ గుహనె
సాక్షాత్కరించి ఇట్లని పలికెను:
"పుత్రా, వృద్ధుడవై పోవుటచే
శత్రులను నీవు సాధింప లేవు.
ఇక ముందుకు నీ వంశములోపల
వీరుడొకడు జన్మించి మీ పగను
తీర్చి రాజ్యమును తిరిగీ పొందును.
ఇదిగో, ఇది ఒక కత్తి, దీనితో
రాళ్ళయినా సర్రున తెగిపోవును.
ఇది ఒక కవచము, ఎట్టి కత్తితో 625
నరికినా గాని నరుకును పడనిది.
ఈ రెండూ ధరియించు వీరునకు
అపజయమన్నది ఎపుడూ కలుగదు.
అట్టి వీరుడిక వచ్చే వరకూ

వీటిని నీ వెక్కడనే ఉంచుము.
మీ వంశముల్లో వారికే తప్ప
ఈ కత్తిని ఎత్తే బలముండదు;
ఈ కవచము కూడా సరిపోవదు,"
అని దేవి చెప్పినట్టి చొప్పునని
వీటిని గుహా డిక్కడనే విడిచెను.
నాటినుండి ఈ కత్తీ కవచము
ఎందరెందరో ఎన్నో విధముల
కదప బోయినా కదలినవి గావు,"
అని మునీశ్వరుడు తెలిపిన సంగతి
విని బప్పడు వింత బొంది: "ఏమీ!
ఈ కత్తి ఎత్తుటే అసాధ్యమా?
చూతం," మని బాల్యచాపల్యముచే
దుర్గ కెదురుగా చని ఒక మొక్కును
మొక్కి కత్తి పిడి పట్టి ఎత్తగా
బోవ,—అయ్యారే! ఎంతటి వింతయొ!—
పిన్న తొండమున చెరుకు గడ వలెనె
తేలికగా కత్తి లేచి వచ్చెను.
చేతికి వచ్చిన కత్తి పట్టుకొని
తెల్లబోయి బప్పడు నిలుచుండెను.
ఆశ్చర్యముచే కన్నులు విడగా
ముని తటాలుమని లేచి నిలువబడి

"తొడుగు, తొడుగు, కవచంబును తొడుగుము,
గుహావంశములో పొడవే కాని
గొల్లపిల్లడవు కావో బప్పా,
వంశపు పగ తీర్చి నీవు తిరిగి
పూర్వుల రాజ్యము సంపాదింపుము,"
అని చెవిలోపల దుర్గామంత్రము
ఉపదేశించి, "కుమారా, నీ వీ
మంత్రము నిత్యము పఠించుచుంటే
శత్రుజయము తప్పక సిద్ధించును,"
అని చెప్పి వింతచే కాళ్యాడని
బప్పడు తను చూచుచుండగానే
గుహాలోపలి వైపునకు మెల్లగా
వెళ్ళి వెళ్ళి అచట మాయమాయెను.

అంతట బప్పడు నిద్రలోనుండి
తుళ్ళిపడినట్లు తెలివి తెచ్చుకొని
కవచమును తీసి తొడుగుకొనంగా
కొల చూచిన లాగే సరిపోయెను.
కవచము తొడిగిన అంతనె వింతగ
ఆకాశము వరకెదిగినట్లుగా
కవచము పట్టక ఉబ్బినట్లుగా
ఊహాలు మదిలో ముదనట్లుగా

కొత్త ధైర్యమూ కొత్త సత్తువా
కొత్త ఉత్సాహమూ మొలకెత్తెను.
ఇంటి వద్ద తల్లివల్ల సరిగా
పుట్టు పూర్వోత్తరములను తెలిసే
తొందరచే కాళ్ళు నేల మోపక
గాలిలో నడుచుచున్నట్లుగనే
నడచి, గుహ వెడలి, పై చిట్టడవిని
గడచి, ఆ మీంది తోట దాటి, తన
ఊరి చేరువకు చేరినంతలో
పడమట పొద్దు గబాలున క్రుంకెను
అంబా అని అరచుచు ఆవులెల్ల
ఊరివైపు నడచి పోవుచుండెను.
కొలకొల కొలకొల కూయుచు పిట్టలు
గూళ్ళ కడకు చేరుకొనుచునుండెను;
చెట్ల ఆకులను జలజల కదల్చి
శైత్య వాయువులు వీచుచు నుండెను;
ముసుగు వలె మసక చీకటి క్రమముగ
దెసలయందు అంతటనూ నిండెను.
కను మూసిన ఆ చీకటిలో బడి
ఊరికి ఈవల ఉన్న తమ గుడిసె
కడకు చేరి బప్పడు ఒక ఇంచుక
తట్టగానె తల్లి ఓరగిలగా

తలుపు తెరచి తన గుమ్మము ముందట
మడిమలనుండి నడినెత్తి వరకు
కవచముతో ఉన్న వింత రూపము
కాంచి, "బప్ప డింటను లే" డటంచు
తటుకున తలుపును మూయబోవగా
"అమ్మా, నేనే, బప్పడనే," అని
పలికి లోపలికి ప్రవేశ మయ్యెను.
వచ్చిన బప్పని మూక ఎగాదిగ
కాళ్ళనుండి తలవరకూ పూర్తిగ
చూచి తల్లి తల ఊచుచు: "ఓరీ
బప్పా, ఇది ఏమి వాలకమురా?
ఎక్కడి కవచమురా ఇది? చెప్పర.
దీని వలన ఇంకేమి మునుగునో?
ఈ పొద్దుట ఊరి బయటి తోటను
నీవు జరిగించి నట్టి దాని కే
ఊరెల్లా గగ్గోలుగ ఉన్నది.
నీ వేమో ఆ తోటలో రాచ
కన్నియలకు తాడు కట్టినావట!
ఔరా! ఇది ఎక్కడి విడ్డూరము!
కన్నె కట్టుటకు రాజుల కన్నెలు
ఆవులో దూడలో అనుకొన్నావో?
వారికి కట్టిన తాడే ఇప్పుడు

నీ గొంతుకే కరితా డయ్యో గదా!
ఆ పిల్లలు ఇండ్లకు రాగానే
గ్రామపు పెత్తనదారు కూతురిని
అడుగగ పై గ్రామపువా రెవరో
వచ్చి, సంబంధమును కుదుర్చుకొని
లగ్నము పెట్టుటకు పురోహితులను
పిలువ వారు గ్రహములను లెక్కించి
ఆ పిల్లకు నేడే రహస్యముగ
పెండ్లి అయిపోయె నని తెలుపంగా 725
ఆ సంబంధము చెడి పోయిన దట!
తోక తొక్కినట్టి పాము లాగున
లేచి పిల్లదాని తండ్రి పిల్లను
నొక్కి రొక్కించి రొక్కించి అడుగ
బిక్క మొగము పెట్టుక ఆ చిన్నది
వెక్కి వెక్కి నీ సంగతి అంతా
ఉన్న దున్నట్లు తెలిపి వేసె నట!
ఏమిరా ఇప్పు ఇంత ఆగడము?
రాజులతోనా సరసా లాడుట?
రాచ పగ అన్న తాచు పగ గదా!
నీ ప్రాణము పుచ్చుకొన్న వరకూ
వారి కన్నులకు నిద్ర పట్టునా?
నల్బది మందియో ఏబది మందియో

వచ్చి నిన్నడిగి పోయినారురా.
నీకు చావు తప్పదురా, కొడుకా.
ఇప్పుడు ఆ తల్లి కవచమూ నీవు
రాగా ఎవడో రాజనుకొంటివని;
ఎట్లు కాచుకొందురు నిను కొడుకా,
అని ఏడ్చె తల్లి వైపు కనుగొని:
"అమ్మా, నాకై అడలగ బోకే,
నాకిప్పుడు వచ్చిన భయమేమే?
రాచవాడ నేనుకొంటివని అంటివి;
నిజముగా రాచవాడను కానా?
రాజపుత్రికడనే ఇప్పుడు
రాజపుత్రికల పెండ్లియాడుటకు
నేను తగిన వాడను కానా మరి?
నీ వెంతటి భద్రముగ దాచినా
నిలుకడ మీదను నిజము తేలినది,"
అని కనులు వెళ్లబెట్టిన తల్లికి
గుహలో జరిగిన ముచ్చటెల్లా
పూస గుచ్చినట్లుగ వినిపించగ
విని కనుకొలకులనుండి కాల్వలై
పారుచున్న కన్నీళ్లతో ఆమె
పులుకు పులుకుమని చూచుచు బస్సి
కవచము మాటే పూర్తిగా మరచి

కౌగిలించికొని, "కుర్రా, బప్పా,
చిన్నవాడ' వని ఇన్ని నాళ్లుమా
చెప్పకుండ నీ సంగతి దాచితి.
దాచక ఇక అంతా చెప్పెద విను:
పూర్వము ఘన రాజస్థానమునకు
వల్లభీపురము ముఖ్యపట్టణము.
ఆపట్టణమును ఒకానొకప్పుడు
శిలాదిత్యు' డను రా' జేలుచుండె.
అతడు సూర్యవంశములో పుట్టుటె
కాక, సూర్యునికి ముద్దుకుమారుడు.
పరరాజులు తనపై "కెవ్వ' డైనా
దండెత్తి వచ్చుటను వినగానే
పురము నడుమ' నున్న సూర్యగుండము
కడ' కా రాజేంద్రుడు వడివడి చని
సూర్యమంత్రమును జపించు; జపించి
నిలుచుండగ ఆ గుండము గుండా
సూర్యుని ఏడు ముఖంబుల గుర్రము
పైకి వచ్చు; అది ఎక్కి ఆ రాజు
పోరు సలుపగా ఆతని ముందట
సూర్యుని కాంతికి మంచు విరిసినటు
శత్రుసైన్యములు చెల్లా చెదరగు.
ఈ లాగున ఏదుపు లేని వాడె

నేల నాళ్లు చెరగులు కూడా తన
పల్లుబడ్డికి లోబడి ఉన్నట్లుగ
పరిపాలనము చేయుచుండగా
ఆ కాలమందు కాబూల్ లేళ్ళే
ఉత్తుఖాను ఆ రాజోత్తమునకు
ఓడి పోయి పగ సాధించుటకై
శిలాదిత్య మంత్రులలో ఒకనికి
లంచమిచ్చి గుట్టుమట్లు కనుగొని
ఆ గుండమ్ములో ఆవుల కొవ్వును
కలిపించి దాని మహిమను చెరిపెను.
ఉత్తుఖాను ఈ మారు దండెత్తి
రాగా ఎప్పటివలె రాజేంద్రుడు
సూర్యమంత్ర మెంతగ జపించినా
మునుపటి వలె గుర్రము రాకుండుట
చూచి తన చావు దగ్గర పడెనని
తలచి శత్రు సైన్యములపై కరికి
దొరికినట్టి తురకల నరికి నరికి
పీలికి కండ ఎరుగని ఆ వీరుడు
వీరస్వర్గమునకు వేంచేసెను.
సహగమనము కోరి రాజ భార్యలు
అగ్నిని పడి జోహారొనరించిరి.
మొరకు తురకల్లా పురిలో చొరబడి

కొల్ల బెట్టి దగ్ధము కావించిరి.
వల్లభీపురము వల్ల కాడుగా
మారుటచే చిత్తుఖాను చేరువ.
కొండ మీద చిత్తూరను దుర్గము
కట్టి ఆచట రాజ్యము స్థాపించెను.
యుద్ధమునాటికి నెల తప్పి ఉన్న
యట్టి శిలాదిత్యుని పట్టమహిషి
పుట్టింటినుండి తిరిగి వచ్చుచు
దారిలో మగని చావు విని బెగడి
కారడవులలోనికి పారి పోయి
ఈ నాగేంద్ర పురమునకు దగ్గర
కొండ గుహను దాగియుండి అంతట
నెలలు నిండగా కొడుకును కనియెను:
ముని చెప్పిన గుహుడే ఆ బాలుడు.
ఆ గుహుడు పెద్దవాడై ఎరుకుల
కూడి ఇచటే ఏడూరికి రాజై
తండ్రి శత్రువులపై పగ తీర్పగ
తంటాలను పడి పడి మృతి పొందెను:
ఇది నీవు విన్న అంశమే గదా!
ఆ గుహు సంతతి పుట్టిన వారలు
ఏడు తరము లేడూరి పురములో
పలి పగ తీర్ప లేక గతించిరి.

ఎనిమిదో తరము పాత్రై పుట్టెన
విజయాదిత్యుడె సుమి నీ జనకుడు!
చిత్తూరి తురకలూ వీరి వంశము
పై పగ బట్టిన వారై కాబట్టి,
నీవు పుట్టినట్టి కొన్ని నాళ్ళకు
అడవులలోనికి వేటకు పోయిన
నీ తండ్రి నచట చాటుగ చంపిరి.
నిన్నూ చంపుదురన్న బితుకుచే
కన్నులు పిడని చిన్నతనముననె
ఏడూరి నుండి నాగేంద్రపురికి
ఎరుకుల సాయముతో నిను తెచ్చితి.
తెచ్చి, ఇచట గొల్ల పిల్లవానిగ
రాజపుత్ర దేశచక్రవర్తిని
నిన్ను నాకంటి పాపకంటెనూ
ఎక్కువగా చూచుచు కాపాడితి.
బాబూ! బప్పా! చెప్పక తప్పని
సంగతి ఒక్కటి ఉన్నది వినుమా.
నీకు నేను తల్లి కాను సుమీ!
నిన్ను కన్న తల్లి జీవింపక
మగనితోడ సహగమనము చేసెను.
నీతల్లికి నే దాదిని తండ్రీ,
నీవు నాకు కొడుకవు కావు సుమీ!

నా ప్రభుకుమారుడవు, నా ప్రభుడవు.
కడుపున కనలేదను మాట కాని
కన్న కొడుకు కన్నా మిక్కిలిగా
కన్నులలో నిన్ను పెట్టుకొంటిని.
ప్రాణము లెల్ల నీపైనే బాబూ.
తల్లిని కానన్నట్టి సంగతిః
వినగానె ప్రేమ విడిచి నన్వదలి
పోవుదువేమో అన్న బెంగచే
ఇన్నాళ్లూ ఈ గుట్టు దాచితిని.
ఇక నన్నేలాగున చూచెదవో,
నీ దయయే నా తండ్రీ బప్పా,"
అని నోటను మాట రాక నిలిచిన
పెంపుడు తల్లిని కనుగొని బప్పడు
కన్నుల గిరున తిరిగే నీళ్లను
గ్రుక్కుకొనుచు డగ్గుత్తికతో "ఓ
తల్లీ, ఇట్లాగ పల్కెదవేమే?
నా తల్లివి నీవేటికి కావే?
నీ కొడుకును నే నేటికి కానే?
ఎవరు నన్ను కనిరో ఎరుగను గద!
కన్న తల్లి చనిపోవగ దయతో
కన్న తల్లి వీవే నా తల్లివి.
తల్లి వన్నట్టి మాటే ఏమీ?

తల్లీ తండ్రీ లేకున్నప్పుడు
తల్లివై తండ్రివై కాచుటచే
తల్లివి నీవే, తండ్రివి నీవె,
ఆపై నా దైవమువూ నీవే.
నిన్నెట్లు చూతునో అననేలా? 875
మునుపటి కన్నా మక్కువతోన్నూ
ప్రాణము కన్నా ఎక్కువగానూ
నిన్ను చూచుకొందును నా తల్లీ.
ఆ లేని పోని అనుమానములను
మానసమున పెట్టుకొనుట మానుము.
అంతే కాక నా పెండ్లి గురించీ
అనవసరముగా అడ్డలగ బోకుము.
నీ ఆరు నూర్ల క్రొత్త కోడండ్రి
తలిదండ్రులతో మన వృత్తాంతము
వివరముగ తెలిపి వియ్యము నడుపుము.
చిత్తూరుకు రాజైన వెంటనే
మీ అల్లుడు తన పెండ్లాల నెల్ల
పిలిపించుకొనుట నిశ్చయమటంచు
వారితో తెలుప గదవే తల్లీ.
ఇక నేనా చిత్తూర్పు రాజ్యమును
ఎట్టి రీతిగా సంపాదించుటో
అది ఆలోచింపవలసి ఉన్నది.

ఎరుకుల సాహాయ్యము లేకుండా
సాధించుట అన్న వట్టి మాటే.
ఎరుకులు నా కెక్కడ దొరుకుదురో?
దొరికినా తోడు పడుదురో, లేదో?"
అని ఆందోళన పొందే బప్పని
చూచి దాది: "అబ్బాయీ, బప్పా,
ఇందు గూర్చి నీవు చింత పడకుము.
ఏడూ రిచటికి ఏడో ఆరో
కోసుల దూరముననె ఉన్నది గద;
ఆ ఏడూరికి తూరుపు దిక్కున
చిక్కిరి బిక్కిరి దారులు కలిగిన
కొండ కోనయే ఎరుకుల వాసము.
అచ్చటకు నీవు చని నే నిచ్చే
బూరతోడ ముమ్మా రూదగనే
ఎరుకు లెల్ల వచ్చి నీకు లోబడి
నీ వేమి చెప్పినా నెరవేర్తురు.
ఇట్లు చేయుటకు ఒట్టు పెట్టుకొని
న న్నిచటికి దిగబెట్టిన ఎరుకలు
నాకు బూర నొకదానిని ఇచ్చిరి,"
అని దాది పుట్టుపూర్వోత్తరముల
నెల్ల విప్పి బప్పనితో చెప్పెను.
ఆ రాత్రి ఎల్ల బప్పని మనసు

పశ్చిమమున పాడి రేసములాగే.
పల్లు పోకలుగా పరుగెత్తుటచే.
కన్నులపై రెప్పే పడదయ్యెను.
ఎంతటిలోపల తెల్లవారునో,
ఎంతట ఏడూరును చేరుదునో,
ఎంతటిలో ఎరుకులు దొరుకుదునో,
ఎంతలోన తుమ్మకల సరుకుదునో,
ఎంతటిలో చిత్తూరు చొత్తునో,
అని చిత్తము తత్తరపడుచుండగ
అంతలో కొక్కొరోకో అటంచు
తొలి కోడి కూత వినగా వచ్చెను.
తన అంతము దగ్గరపడు టెరిగిన
విధమున దీపము వెలవెల పోయెను.
చెట్లను పిట్టలు కొంచెము కలకల
కదలి అంతటనె కూరుకు చెందెను.

కోడి కూత చెవి పడినంతటనే
తటాలు మటంచు లేచిన బప్పడు
అన్ని సరంజాములూ సిద్ధమై
పంపుడు తల్లి అనుజ్ఞను కైకొని
పైకి పయనమై వచ్చి నంతలో
భళ్ళునని తెల్లవారుచు నుండెను!

ఊరి వెలుపటికి చేరినప్పటికి
తూర్పున పొద్దు పొటుక్కున పొడిచెను.
కుదురు గలుగు ముదురు కెంపు బంతిని
పోలుచున్న ఉదయసూర్యబింబము
మెల్ల మెల్లగా మీదికి ప్రాకెను.
చెట్ల మీదనూ గడ్డి మీదనూ
ముత్యముల వంటి మంచు తుంపురులు
సూర్యకిరణములలో తళతళమని
వజ్రపు పొడు లేమో అనిపించెను.
సగము నీడలో సగ మెండలోన
ఉండుటచే కొండలెల్ల సరిగా
అర్ధనారీశ్వరుల వలె కనబడె.
దారిలోన్న జలజలమని పారే
సెలయేళ్ల నీళ్లు తుళ్లుచు ఎండను
తళతళమని మెరయుటచే, మురిపమున 9
కిలకిల నవ్విన లాగే తోచెను.
ఈ వింతలొక్కటికీ కన్నులు
లేక తన మహాలోకములోనే
మునిగి కేవలము ముందు చూపెగా
బేగీరా వడుగులతో బప్పడు
జామున్నర పొద్దెక్కిన లోపున
వడూర్లి తూర్పుకోనకు చేరెను.

చేరి అచట తన చేతను పట్టిన
ఇత్తడి భూరను ఎత్తి నోటితో
చెవులు గియ్యిమ్మను నట్లు గట్టిగా
మూడు మారులూ ఊది నిలువగా.
మరి ఒక గడియకు చుట్టునూ ఉన్న
పొదలు, లోననుండియు ఒక కొంచెము
పీడగా, అట్లుంకలిగిన అందలి
సందులలో మసిరాసిన తీరున
కారు నలుపగు వికారపు మొగములు
నలు వైపులకూ బెదరు చూపులను
చూచుచు బూచుల లాగున తోచెను.
పొద లన్నీ కన్నులుగా వన మిటు
బెదరు చూపులను చూచుచుండగా
అంతలోన ఒక పొదనుండి వెడలి
నిట్ట తాటి వలె నిడుపగు వాడూ,
కాటుక కన్నా నల్లని వాడూ,
పిడి కచ్చు వంటి సిగ గల వాడూ,
కరకు మీసములను కలిగిన వాడూ,
కణకణమని చింత నిప్పు లట్లే
మెరయుచున్న మిడిగుడ్ల వాడూ,
నల్లరాతి పలక లాగు దృఢమై
చాల వెడల్పగు చాతీ వాడూ,

సాము కసరతులు చేయుట చేతను
కండలు కట్టిన దండల వాడూ,
ముడుకుల నుండీ మొల వరకూ కడు
గట్టి బట్ట ఎగగట్టిన వాడూ,
పదను పెట్టి ఉన్న గండ్రగొడ్డలి
భుజము మీద వేసికొన్న ఎరుకల
రేడు తిన్నగా ఇటు అటు చూడక
బప్పని వైపుకు వచ్చి నిలువబడి:
"జీయ్యా, బూరను ఊదుటచే నిను
విజయాదిత్యుని కొడుకుగ ఎరిగితి.
నీ తండ్రి తాతల రీతిగ మా
జాతి' కెల్ల నీవే ఇక రేడువు.
నేనూ నా ఎరుకలునూ తప్పక
నీ' వేమి చెప్పినా చేసెద," మని
చేతులు కట్టుక నిలువగ బప్పడు:
"ఎరుకు నాయకా, 'ఏమి చెప్పుటకు
ఏ" మున్నదీ? నా తండ్రిని చంపిన
తురక మీద కసి తీర్చుకొనుటకూ
చిత్తూరు రాజ్యమును పొందుటకూ
మీరునాకు సాయము కావలయును.
ప్రాణ' మున్న వరకూ ఈ బప్పడు
మీరలు చేసే మేలును మరువడు,"

అనగా ఎరుకుల పెద్ద బప్పనికి:
"జియ్యా, మీ చేతనైన సాయము
చేయుటలో ఏమీ వెనుతీయము.
కాని నీవు తలపెట్టిన కార్యము
అసాధ్యమేమో అని నే తలచెద.
చంద్రునిలోపలి మచ్చను పట్టిన
వాడు తప్ప పైవా డెవ్వడునూ
మీ తండ్రిని చంపిన ఆ డౌలతు
ఖాను ప్రాణములు తీయగ లేడని
ఫకీరొకడు మునుపు చెప్పినాడట!
ఎక్కడి చంద్రుడు? చంద్రునిలోపలి
మచ్చను మనుజులు పట్టుట ఎక్కడ?
అట్టి వాడు తను చంపుట ఎక్కడ?
అని నిశ్చింతగ ఆ మొరకు తురక
దేవుడై గురువునై అన్నట్టు
మిట్టిమిట్టి పడుచున్నాడు గదా!
అట్టి వాని ఎటు చంపగ వచ్చును?"
అనె బప్పడు: "ఓ ఎరుకు నాయకా,
ఫకీరు చెప్పిన వికారములు ప
ప్రకారముగ నిజమనుకొంటివా ఏమో!
ఫకీర్లు బికార్లు పలికిన మాటల
కకారణముగా అడలి పోదుమా?

తురక దైవమగు చంద్రుని లోపలి
మచ్చ వెనుక దాగున్నా సరియే
గడ్డము పట్టుక ఈడ్చుకొని వచ్చి
డౌలతుఖానుని డాస్ డౌలత్తులు
మంటను కలుపక ఎట్లా విడువను.
ఫకీరు మాటకు భయపడు' టేటికి?
ఈ కత్తీ ఈ కవచమూ నాకు
ఉన్నంత వరకు గెలుపే కలుగును.
జంకు విడిచి ఓ ఎరుకు నాయకా,
చిత్తూరుకు మరి పయనము కమ్మా,"
అనిన ఎరుకు: "జియ్యా, చిత్తూరుకు
పయనము కా' నక్కర లే' దిప్పుడు.
ఆడబోయి' నట్టి తీర్థ' మెదురై
నట్లే దౌలతు ఈ కోనలోన
ఇక్కడి' కరకోసెడు దూరములో
వేటలాడుచున్నాడు; అల్లదే
మెలికలు మెలికలు గాగ చుట్టుకొని
మీదికి పొగ లేచుచున్న చోటే
ఆ ఖాను గాడి గుడార' మున్నది.
ఖానుతోడ మాటాడగ వచ్చితి'
నని వాని చేరి ఆ సమయమునకు
ఎట్లు వీలగునో అట్లుగ నడుపుము.

మేమూ నీతో చాటు చాటుగా
తుప్పన్నుండి పై తుప్పకు దాటుచు
తప్పక నత్తుము; బప్పారాయా,
ఎప్పుడు బూరను నీ' వూదెదవో
అప్పుడే వచ్చి సాయ' మొనర్తుము,"
ఇట్లు చెప్పి ఆ ఎరుకు నాయకుడు
వెనుకకు చని తిరిగి పొద దూరెను.

తిన్నగా తురక' లున్న దిక్కునకు
మొగ్గ' మై బప్పడు పోవ పోవగా
పావు కోసు దూరమున అటునుండి
వేటకుక్కలూ గుర్రపు రౌతులు
వెనుకనుండి కేకలతో తరుమగ
తిరిగి చూచుటకు తెరిపి లేక తన
ముందరి కాళ్లను ముందరకూ మరి
వెనుక కాళ్లు వెనుకకూ పూర్తిగా
చాపి ఒంటితో సమానముగ తన
పొడుగు చెవులు రిక్కించి నేలపై
కాలును మోపక గాలిలోపలనె
మెరపు లాగు పరుగెత్తుకొని వచ్చి
చెవులపిల్లి ఒకటి ఆ బప్పని
కాళ్లలోన పడి గజగజ వడకుచు

మూతి అతని కాళ్ళమీంది పాముచు
కన్నీరు కారు కనులు పైకెత్తి
జాలిగా మొగము వంకను చూచెను.
మనసు కరిగి బప్పడు: "ఓ శశమా,
రాజస శశియమా అర్ధము కావున
రాజును కాబోవుచున్న నా కడ
చేరితివా?" అని చెప్పిన అదియే
చంద్రునిలో మచ్చ అన్న సంగతి
మనసులో తట్టగా గతుక్కుమని
ఆశశమును పట్టి ఎత్తి అంతట
చేరిన జాగిలములను తోలగా,
ఆ పైన నక్కీ తలపాగాలూ,
గుడ్డ గుండీల అంగరఖాలూ,
పట్టి ఉన్న షుర్వాలూ, మొలలకు
కట్టి ఉన్నట్టి రంగు రుమాళ్లూ,
కత్తిరింపు గడ్డాలూ తామూ
తురక రౌతు లేతెంచి అదేదో
కీసర బాసర బాసతో పలికి,
"దేవుడే" వనుచు కేకలు వేసిరి.
ఏది దేవుటో ఎల్లు దేవుటో
ఎరుగక బప్పడు: "ఏమి దేవవ్రలె?
మాంసాంశములన్నా దేవ వలయునా?"

అనగా తిరిగి అయోమయముగా
ఏమో మేమో అని తురకలు: "జిబ్రీ
ఆవు, ఆ" వనుచు అల్లరి చేసిరి.
"జబ్రి ఏమిటో? ఆవు ఏమిటో?
చబ్రి తిని ఆవు 'తోలు'మందురో?
ఆవుల 'కాపరి' నని ఎటు ఎరిగిరి?"
అనుకొని బప్పడు ఆ తురకలతో:
"ఆవుల తోలుటె నే' నానుకొంటి;
'ఆవుల వలె మీ తురకల' నెల్లా
తోలు" మనిన తోలెద," నన తురకలు
తిరిగి ఏదో అరువగ, "ఆహా!
తువ కబ్బుర తురక భాష అన్నటు
ఇది ఎక్కడి ఘోష వచ్చె?" ననుకొని,
"ఖాను దగ్గరకు వచ్చెద," నటంచు
బప్పడు సైగలచే చూపించెను.
చుట్టు ముట్టి వా' రెల్లా తనతో
రాగా, మరి కొంత దూరమును చని
అక్కడొక్క చెట్టు క్రింద బప్పడు
దౌలతుఖాను గుడారము కాంచెను.
కొంత సేపటికి ద్విభాషి ఒక్కడు
"ఖానుగారి పలుకు' వైసది ర," న్నన
వానితో గుడారము లోనికి చని,

అక్కడ పట్టు హిజాగూ, మొకమల్
కబ్బా, జరీ బుటా పని టోపీ
ధరించి సోఫా మీద సొంపుగ
కాళ్ళు చాపి, పాము మెలిక' లొబ్లగ
చుట్టుకొన్న తెగ బారెడు హుక్కా
గొట్టము కోటను పెట్టుక గడగడ
గుడగుడ' మనిపించుచు, తీగెలలో
పొగమంచు వలెనె గడ్డము లోపల
కమ్మి వెడలు పొగ నడుమను ఎర్రని
కన్నులు నిప్పుల వలె కనిపించగ
బప్పడు డౌలతుఖానును చూచెను.
దుబాసి చెవిలో: "నబాబు సాబుకు
సలాము పెట్టు," మనంగా బప్పడు:
"గులామునా నే' సలాము చేయగ?
సలామూ లేదు గిలామూ లేదు," 11
అని బోర విరచి నిలువబడంగా,
అంతట మబ్బుల మాటున వినబడు
గురగుర' మను' నట్టి ఉరుము లాగున
పొగ వెనుకనుండి డౌలతు మాటల
చప్పుడు బప్పని చెవిలో పడియెను.
దుబాసి బప్పనితో: "ఓ కాఫర్,
సర్కారో రాతులు తరిమే జంతువు

ఏల పట్టితివి? ఎవ్వడ'? వని నూ
సర్కార్ సాహేబ్ అడుగుచున్నారు,"
అనిన వీరు: "సాయెబయ్యా, నేనే
విజయాదిత్యుని కుమారకుండును,
మీ సర్కారుకు మారకుండనూ.
చంద్రుని లోపలి మచ్చవంటి ఈ
చెవులపిల్లినే' పట్టక పోతే
'చెవులు పట్టి మీ సర్కార్ గొంతుక
'కోయుట సాధ్యము కా' దని పట్టితి,"
అని బప్పడు చెప్పిన ఆ జవాబు
నవాబు తోడ దుబాసి తడబడుచు
చెప్పగ వాడు తులుక్కు పడి లేచి,
"అరే, అరే, అల్లా, అల్లా!" అని
జడుపుచేత కడు గడగడ వడకుచు
గుడాకు కాయ దడాలున పడగా
గుడారమందుండి వెడలి వడి వడి
పరుగెత్త బోవ బప్ప' డడ్డుపడి,
ఒకే నరుక్కు రెండే తునుకలు
కాగా పోలతుఖాను శిరస్సును
కేస్సున ఖడ్గముతో తెగ నరికెను.
జేనెడు మీదికి సరిగ్గా ఎగిరిన
ఖానుగాడి తలకాయ గాలిలో

గిరగిర గిరగిర మొగ్గలు కొట్టుచు
దెబ్బున చివర్కగు దిగువను పడియెను.
చిమ్మనగొట్టముతోడ వసంతము
కొట్టినటు ఖాను గొంతుక వెలువడి
బుస్సున నెత్తురు ధార్కలు లేచెను.
"అయో! నవాబ్ మర్గయా," అటంచును
దుబాసి సాహెబు తోక తెంచుకొని
ఒకటే ధూకుగ పైకే దూకెను.
ఇంతట బప్పడు బూర ఊదగా,
"ఉరుకు," "ఉరుకు," "నరుకు," "నరుకు," మంచును
ఎరుకులు కెవ్వున కేకలు వేయుచు
మొరకు తురక మూకల మీది' కురికి
కరకు గండ్రగొడ్డండ్లతో వంట
చెరుకును నరికిన కరణిని నరికిరి.
నెత్తురు వరదలు కట్టినట్టి ఆ
నేల మీద కుప్పలుగా తురకల
గడ్డపు తలకాయలు పడి, గీరిన
తాటి 'టెంక' లట్లో కనుపట్టెను.
తురక కళేబరములపై దుస్తులు
తీసి దులిపి ఎరుకలూ బప్పడూ
చిత్తూ' రెట్లుగ సాధించుటయో
ఆలోచన చేయుచునుండ, అంతట

నాగేంద్రపురములోని క్షత్రియులు
మనబప్పని మామలూ బావలూ
దాది వల్ల సంగతి ఎల్లా విని
అతనికి సాయము చేయుద' మటంచు
బయలుదేరి వచ్చుచున్న వారలు
ఆసమయంబునకే బప్పనితో
కలిసికొని, అతడు చెప్పిన చొప్పున
తురక వేసములు వేసి అందరూ
కూడి హుటాహుటిగా చిత్తూరికి
చీకటి పడు'నంతకు చేరుకొనిరి.
చిత్తూరు కాచు పారా బంటులు
చీకటి వలనా దుస్తుల వలనా
తమ నవాబు దండే వచ్చిన'దని
నగరపు తలుపులు బాగుగ తెరచిరి.
ఆటంకము లేకుండా ద్వారము
దాటి కోటలోపలికి చొరంబడి..
అచ్చటి రక్షకభటులను చీలిచి,
ఆ[illegible]మడిపుగా ఉన్న సైన్యములు
శూన్యములుగ నాశనము కావించి,
బప్పడూ అతని తోడి వారునూ
చిత్తూరి పురపు కోటను పట్టిరి.

పురి లోపల గల హిందూ జనులకు
ఆ రాత్రి ఎల్ల దీపావళియే!
రాజపుత్ర దేశమందు తిరిగీ
రాజపుత్రికుల రాజ్యము వచ్చిన'
దని ఎటు కన్గొనినా వేడుక లే,
ఏ దిక్కు చూచినా తెయితక్కలె,
ఏ వైపున విన్నా డబడబలే,
ఏ పక్క పోయినా గుబగుబలే!
వాడవాడలందు అమ్మలక్కలు
కూడి బుగ్గలను వేళ్ళు పెట్టుకొని:
"విన్నా' వటె ఈ ముచ్చట, అక్కా?
శిలాదిత్యు వంశములో పుట్టిన
గుహుని తొమ్మిదో తరము వాడటే!
బప్పారా'వట"! అన ఇం' కొక్కతె:
"చెల్లీ, పదునై' దేండ్ల వా'డటే!
ఆరు వంద'లసూ్త్రముల మగ' డట!"
అన మరి ఒక్కతె: "వదినా, శశమును
పట్టి, అదే చంద్రునిలోని మచ్చ
కావున డౌలతుగాడిని చంపెను;
శశము వలన అభ్యుదయము పొందిన
ఇతని వంశము శశోదయ' మగు' నట!"
అన వేరొక్కతె: "మరదల, వింటి వె?

ఈయన పెంపుడు తల్లి, ఆపై
ఇతని ఆరువందల పెండ్లాలూ,
నాగేంద్రపురమునుంచి పయనమై
రేపె వత్తు' రట! ఇక ఎల్లుండే
బప్పరాజు పట్టాభిషేక' మట!
అప్పుడు నే నీ చొప్పున పాడెద,
విను," దని ఆ సతి పాడగ సాగెను:

"కుప్పలు కుప్పలు పెండ్లాలను గల
బప్పారాయా, నీకు మంగళము.
అప్పరమేశ్వరి చే కత్తి కొనిన
బప్పారాయా, నీకు మంగళము.
గొప్ప బలము గల తురకల కూల్చిన
బప్పారాయా, నీకు మంగళము.
తప్పక చిత్తూరును సాధించిన
బప్పారాయా, నీకు మంగళము.

సంపూర్ణము.